# ర తి రా జు

రచయిత:—

మల్లాది



ప్రకాశకులు

పసుపులేటి బాపరాజు

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

రాజమండ్రి

19944

కాపీరైటు రిజర్వుడు]

[వెల **0-8-0**

# ఒక్కమాట:—

కోటివిద్యలూ కూటికొరకే అన్నసామెత ఏనాడు ఎవరు పలికారో తెలియదు కాని అది యెంతో అనుభవంమీద వెల్లడించిందిమాత్రం సత్యం—

ఏమంటారా:—

ప్రపంచం ఎల్లా మారిందంటే పొట్ట జరక్కపోతే ఏదో ఓవేషం వెయ్యడం—దానికి తగిన హంగులన్నీ సంపాదించడం—దేశాల మీద బడడం—ప్రజల్ని మోసగించి డబ్బు గుంజుకోడం—ఇదీ—

చూడండి:—

అయినింటో పుట్టాడు— ఆకతాయిలా తిరిగాడు— చదువు సంధ్య లబ్బలేదు— మూడుముళ్ళూ పడ్డాయి— సంసారం నష్టన పడింది— ఓపూటుంటే రెండోపూట పస్తు— చూశాడు చూశాడు— పెద్దయెత్తెత్తాడు— లోకంకళ్లో దుమ్ముకొట్టి పెళ్ళాం పిల్లల్ని పోషిస్తున్నాడు—

సబబే అనండి:—

దానికిమాత్రం మంచిచెడ్డలు లుండద్దూ?

మీరే గ్రహిస్తారు—

చదవండి—

* * *

రచయిత

౧

'వీరాస్వామీ! ఏమిటోయి ప్రోగ్రాం ఇవ్వేళ'

'ఏదో నువ్వే వెయ్యాలి'

'ఏం వెయ్యను- ఎక్కడా ఏదీ అంకలేదు'

'ఎప్పుడూ యింతే- శుష్కప్రియాలూ- శూన్యహస్తాలూ'

'ఏం జెయ్యమన్నావు- ఎంత ట్రై చేసానో నీకేం తెలుస్తుంది'

'ఏం ట్రై చేశావో- వారంరోజుల్నుంచి నేనే తంటాలు పడుతున్నాగందా?'

'నిజమే! నీకన్న ఎక్కువ యిదిపడుతున్నాను- ఎక్కడికెళ్ళినా చుక్కెదురే'

'చుక్కెదురుగాకపోతే నీ వల్లేవౌతుంది?'

'ఇప్పుడు నాపని ఇలాగే ఉంది'

'ఒకప్పుడింతకన్న ఎక్కువగా అఘోరించిం దేమిటి?'

'ఎప్పుడూ యిల్లాగే ఉంటుందా?'

'ఎందుకుండదూ- చవురు కాళ్ళు'

'దెబ్బకోయి- చూస్తోవుండు నాతడాఖా- ఉం దుం డెంతపన్లు పడుతుందో'

'ఎప్పుడో పడితే ఏం లాభం- ఇవ్వేళ చేతిలో ఏగాణి లేదు'

'ఏంజెయ్యమన్నావు- అన్నిచోట్లా అరువెట్టాను'

'ఈపూటకెక్కడో ఓచోట మగ్గంబగ్గు- రేపటిమాట చూసుకుందాం'

'ఎక్కడొగ్గనూ - మాయింటోదాన్ని తన్నినా ఏగాణూడి పళ్ళేదు'

'నేను పదికొట్లు నమిలించినా- చిల్లిగవ్వ పలకలేదు'

'ఆచార్లూ! ఇద్యోల నావల్లేంగాదు – ఎవరితో వారిదే యిద్యోల!'

'వీరేశా– నేనెంత తాగుబోతునైనా– నీచాటునుండిగౌరవంగా రోజులు గెంటోస్తున్నాను. ఇవ్వేళ అదోమోస్తరుగాఉంది – పడాలి తొందరగా శాస్త్ర కూస్తో'

'దానికేం దొరకఁవించడంలేదు'

'నువ్వు తలచుకున్నావంటే ఏదోవేస్తావుటంచనా'

'నన్ను ఖ్యేస్తున్నావుగాని ఏం లాభంలేదు'

'మహల్లాగా'

'ఈయేలకుండలేవేటి?'

'ఉండలేను. నీకాళ్ళట్టుగుంటాను– మాటదక్కించుగుండీ పూటకి'

'ఈపూటకి మాటదక్కించుకుంటే– రేపు మళ్ళీసిద్ధం'

'ఇహాల్లావుండదు మనవని'

'ఏం– ఏదేనాఛాన్సు కొట్టావా?'

'ఈవేళో గొప్పబైరాగి చేయిచూసి చెప్పాడు– గొప్పఛాన్సే తగులుతుందిట'

'బైరాగోడా?'

'అలా తీసియుని– మాయిళ్ళవక్కనందరికి చెప్పాడు– తెల్లపోయారు'

'డబ్బు లాగుతానికి– మాయముండాకొడుకులుమాయమాటలు చెవతారు'

'ఎవరిదగ్గిరా కానుచ్చుగోలేదు'

'ఇవ్వందే యెలాపుచ్చుకుంటాడు?'

'ఈస్తావన్నారు– గురువాజ్ఞ లేదన్నాడు'

'నువ్వేం యిస్తానన్నావ్?'

'నాదగ్గరేం లేదని అతడేచెప్పాడు— నేనేమిస్తాను'

'ఇంకేంచెప్పాడేంటి నీకు?'

'ఏమైనా చెప్పాడు— అల్లాజరిగితే—కోర్టులో పాగావేశేనన్నమాట'

'అదేంటో వినిపిద్దూ?'

'కలాసాగా కూచుని చెప్పాలి— కడుపులో కాలుతోంది— పడాలి'

'కూడు దినరాదూ?'

'నీకూ నాకూ కూడుతింటే కడుపునిండుతుందా?'

'సారా యేసుగోవాలికామోను'

'అదిపడితే కాలిమీద కాలేసుకూర్చున్చుని చెపితే— దంగై పోతావు'

'అయితేపద—'

అంటూ వీరాస్వామి— దోవతీసాడు సారాకొట్టుకి. అతనివెనకాల బడ్డాడు సూరాచార్లు.

ఇద్దరూ సారాకొట్టులోకెళ్ళారు— ఆకొట్టు యజమాని వీరాస్వామిని చూడ్డంతోటే మండిపడుతూ—

'ఏమోయి! ఎన్నాళ్ళని అరువుతాగడం'

'భీమయ్యగారూ! మీరల్లాగంటే మాబోటాళ్ళం ఎల్లాబతకటం'

'పదిరూపాయిలకి పైగాయివ్వాలి— ఎన్నాళ్ళని'

'ఎల్లుండిపొద్దున్నదాకా ఫూరుకోబాబూ— అణాపైసలతో యిచ్చేస్తాను'

'చూద్దాం— నీనిజాయితీ'

'నిజాయితీఅంటే ఈ రాసామిదే అనుకోవూ?'

'సరే— ఆవేళబాకీ చీదాగా యివ్వకపోతే పక్కలిరగదన్నడమే'

'అంతే'

'వెళ్ళిరా—ఎల్లుండి డబ్బుటార్కెండా రాకు'

'మరెప్పుడు?'

'ఇప్పుడు డబ్బు తెచ్చావా?'

'డబ్బంటే బొడ్డుకొంగు దులిపేద్దును'

'ఇహ నీకరువిస్తాను— అదిచ్చి మళ్ళీరాదుకో'

'ఇచ్చేస్తానయ్యా— ఎల్లుండిపొద్దున్నదాకా ఆగితే డబ్బు కొల్లలు'

'ఆవేళ డబ్బు దిట్టంగావుంటుంది కాబట్టి దిట్టంగాతాగు'

'మరీయేల బాగాతగిలించాలి'

'నాకక్కడ అరువిస్తారా? డబ్బు కక్కమంటారు'

'సికేవయ్యా— బాగ్గడించావు'

'అన్నీ యిలాటిపద్దులేఅయితే గడించినట్లే'

'అన్నరోజుకి నాలుగురోజు లాలస్యమైంది— అంతేకదూ'

'నన్న నాలుగురోజులుకాదు— నాల్గునిమిషాలుకాదు— ఒక్క నిమిషం ఆగరు'

'ఉందికనక'

'ఎక్కణ్ణించొస్తుంది'

'రోజుకి రెండొందలమ్మకం'

'అందులో అరువో'

'అరువెంత— పదిరూపాయిలుంటుందేమో?'

'వచ్చేలాభమెంత'

'అంతా లాపమే'

'నువ్వనుకుంటున్నావు'

'వరేగాని రెండాల్మ లొయ్యండి'

'ఒకటి చాలదూ?'

'ఈకంసాలి శనిగాడొదునాకు'

'మళ్ళా పెద్దింటో పుట్టాడు— ఇదేంపోయికాలం'

'అలువచ్చాడు—ఒదులుద్దా?'

'మీాయిద్దరికీనేస్తం ఎల్లాకుదిరింది?'

'ఇక్కడే—'

'సరే— ఇవేళకో ఏముకొందుమ్మెప్పావళా అవుతుంది— ఎల్లుండివ్వాలి సుమా'

అని యిద్దరికీ చెరోడాగ్రిమ్ యిచ్చాదు. రెండునిమిషాల్లో పీల్చేశారు. కొట్టువిదిలిబై టకొచ్చారు. తందనాలాడుతో— ఓఅరుగుమీాద కూచున్నారు. సూరాచార్లు నిషాతో— వూగిసలాడుతూ—

'ఈరేశూ— భీమయ్యకి మంచిటోకరాయిచ్చావు'

'ఎలాగా యెయ్యకపోతేఎల్లా—వీక్కతినేశావు'

'మాటదక్కించుకున్నావు—ఎలుగెలిగితే నిన్ను మరిచిపోతానా?'

'ఆఎలుగేంటో కూంత చెపుదూ'

'ఇనవా! ఇను—అదుచెప్పాదుగదా— నాకు రెండేళ్ళుపోతే గొప్పయోగం పడద్దట—దేశాలన్నీ తిరుగుతానుట—గొప్ప గౌరవం—డబ్బా—అన్నీ వుంటాయంట—గొప్పవెలుగు వెలుగుతానుట—'

'జోనుగానీ—అప్పుదు నేకనుపిస్తానా?'

'అదేవిటీ? నువు నాకూడానేవుంటావు?'

'నీకూడానే—బేష్—వహ్వా'

'నాతోపాటు నువ్వూ—హాయిగావుంటావు'

'పొంగిపోకు—బైరాగా డూసులికి?'

'మనకియోగం పడుతుంది'

'ఆదుచెప్పడవ్వూసరే—నువ్వు నమ్మడవ్వూసరే—నేనూకట్టడంసరే'

'నువ్వనేదేమిటీ?'

'అదంతా మాయ—కల్ల'

'ఎప్పటికీ కాదు'

'అయితీరుతుంది'

'చెయి తెగ్గోయించుకుంటా అల్లాజరిగితే'

'జరక్కపోతే—వేళ్ళొక్కసేసుగుంటాను'

'ఎఱ్ఱినాగమ్మా — మామాచదువుకొన్న గొప్పోళ్ళకేగార్నం లేదు—నీకెల్లాగోయి'

'అశ్వకర్మం—నాకొస్తుంది'

'తాగుమోతాడి గ్గార్నంఏంటి?'

'అప్పుడు తాగుతానా—తాగను—దర్జాగా — కాలుమీద కాలేసికూర్చుని—'

'నీమొహం— తిండికేళ్ళైందిపో'

'పోతానులే—నువ్వఘోరించు'

'నాకేం అగోరించేదాకా—బైరాగాసాసులు తినైతే నువ్వే అగోరిస్తావ్'

'ఎప్పుడూ ఉత్తవికావు'

'ఆడిదంతా డాబుసరి'

'సీదా'

'నాదా— దర్జా— నే తాగాసింత— నీకు పోయించాను'

'ఎదవపోతలే— అన్నురూపాయి— ఓహ్రామ్'

'అదే లేకేషిశావ్'

'ఏడిశావంటే పళ్ళురాల్తాయ్'

'ఊడగొట్రా పళ్ళు నీయబ్బసిగదరగ'

'ఊడగొట్టానంటే ఇశ్వబ్రాహ్మడిదెబ్బ'

'చచ్చుపన్నాసీ! ఈరాసామి కంసాలాడిచేత దెబ్బతింటాడా?'

'కంసాలాడనకు— ఇశ్వబ్రాహ్మడను'

'విశ్వబ్రాహ్మణుడు కాదు—నీయెదం'

'ఏమిటా పొగరుమోత్తనం'

'పొగరు నీదా—నాదా'

'నాదేరాపొగరు—భంచోత్'

'రెక్కలిరగ దంతాను'

'ఈరాసామిగాడు నన్ను కొట్టబలతడవే'

'దద్దమ్మా—నోరుమూసుకో'

'నేమూసుకోన్రా—గాడ్ది'

'గాడిదిన్రా—నోరుముయ్యి'

అని కాలిచెప్పుతో రెండుదవళ్ళమీద వాయించాడు. సూరాచార్లు తాగుడుమైకంమీద వీరాస్వామితో కలబడ్డాడు. ఇద్దరూ కొట్టుకుంటున్నారు. వీరాస్వామి ఆచార్లునికిందపడేసి గుద్దుతున్నాడు. ముక్కుంటా- నోటంటా- నెత్తురొస్తోంది. ఆదారంటపోయే మనుష్యులిద్దర్నీ విడిపించాలని విశ్వప్రయత్నంచేసారు. వీరాస్వామి కొంచెం వినేమార్గంలోవున్నా ఆచార్లు వినేటట్టులేడు. ఒళ్ళంతా రక్తం కాలుసేతుకట్టినా యింకా వీరాస్వామిమీదకి దూకుతున్నాడు.

పదిమందీ పోగయ్యేరు. అందులో మంచిబలంకల ఓమునిపి—మీరుపోట్లాట మానంతారా? ఇద్దర్నీ తన్నమన్నారా అంటూ విడదీసి నుంచోబెట్టాడు. ఆచార్లు వొగురుస్తున్నాడు. పెద్దమునిపి- మీాయిద్దరికీ దెబ్బలాటెందుకొచ్చిందనడిగాడు వీరాస్వామిని.

'ఈడు కంసాలాడండి. నారాయణాచార్లు కొడుకు. గంటగుంటకే తాగుతాడండి.

అనిచెప్పుతూంటే సూరాచార్లు—

'వీడు భటాచోర్— ఫుండాకోర్— తాగుమోతు— దొంగ— రౌడీ— కేడీ— అని పళ్లుబిగించి వీరాస్వామిమీదికి దూకబోయాడు.

వాడు కన్నెర్రజేసి 'ఈమాటు దెబ్బకి చంపేస్తా చూడండి. నేనూరుకొన్న కొద్దీ పేల్తున్నాడు. శనిగాడల్లా నేనెక్కడకో పోతూంటే గతిలేదు. ఓ డ్రాం పోయించమన్నాడండి. దిట్టంగా పోయించాను. మత్తెక్కి దెబ్బలాటకి దిగొన్నాడండి.

అని చెప్పగా ఆపెద్దమనిషి అంతేనా ఆచార్లూ అనడిగాడు

'దాదుబాజీ నేతాగనండి, అడుగడుక్కీ తాగుతాడు. ఈడు నాకు సారాపోయించాడంటే మీరునమ్మారా'

'ఇయ్యాలేకాదండి ఎల్లనేగాని లేకుండా ఒస్తాడండి. సారోసారో అని కూకుంటే అదేపోయిందని రోజూ పోయిస్తానండి.

అన్నాడు వీరాస్వామి -

'నేతాగుతోంటే నువ్వుచూశావురా ఫుండాకోరా'

అంటూ ఆచార్లు మళ్ళీ వీరాస్వామిమీద కురుకుతే పీకపట్టుకుని నాలుగ్గుంజులు గుంజాడువాడు. దాంతో సొమ్మసిల్లి పడిపోయాడాచార్లు. ఆపెద్దమనిషి వీరాస్వామిని కూకలేసి అవతలికి గెంటేశాడు.

ఆచార్లుగారి మొహంమీద నీళ్ళు చల్లించి తెప్పరిల్లజేశాడా పెద్దమనిషి. మళ్ళీలేచి ఆచార్లు ఆ మాదర్ఛోదేడీ?

అంటూ గిరగిర తిరుగుతూ కనపడితే తినేస్తా, మింగేస్తా, నాతడాఖాచూపిస్తా అనిపేల్తున్నాడు.

ఆపెద్దమనిషి చావడానికి సిద్ధమయ్యావు. నువ్వువాళ్ళంజేస్తావు అంటూ రెక్కలూ పుడిచిపట్టుకొని తాగలేదంటావు, తాగనంటావు, ఇదంతా ఏమిటి? నువ్వు విశ్వబ్రాహ్మడవుకదా తాగచ్చునా? అందులో నారాయణాచార్లు కొడుకువి. మీతండ్రిపేరు చెరపడానికి పుట్టావు. నడు ఇంటికినడు.

అని గెంటుకుంటూ నడివీధిలోకి తీసుగొచ్చి- నెమ్మదిగా యింటికి పొమ్మని సాగనంపి తనదారిని పోయాడు. మజాయిగుసిముపాలకి క్రమంగా

ఆచార్లుకి మైకం వొదిలింది. అప్పటికిల్లు చేరుకున్నాడు. ఇంటోవాళ్ళు రక్తంతో తడిసిన అతనిబట్టలూ— ఆమనిషివాలకం చూసి— సంగతంతా తెలుసుకున్నారు. తండ్రి ఆచార్లుని నానాబూతులూ తిట్టి యింటోంచి పొమ్మన్నాడు. అంతా అసహ్యించుకున్నారు.

ఆచార్లు తాగుడు మైకం వదలగానే ఏం జరిగిందో— అనుకుంటూ ఆబట్టలు తీసేసి మంచిబట్టలేసుకుని వీరాస్వామిని వెతుక్కుంటూ వెళ్లాడు. ఎక్కడా కనపడక ఇంటికి చేరుకున్నాడు. ఒళ్ళంతానొప్పులు— మంచాన బడ్డాడు

వీరాస్వామి పోట్లాట చాలించుకుని నెమ్మదిగా యింటికిచేరుకున్నాడు. ఆడ్ని కుమ్మేశాను. చచ్చాడో. బతికాడో?

అనుకుంటూ తిండితిని పడుకున్నాడు.

తాగినవాళ్ళగతంతేకాదూ!!!

౨

నెల్లూరుజిల్లాలో పేరుమోసిన నారాయణాచార్లనే కంసాలున్నాడు. ఆతడు కులవృత్తిలో అందెవేసినచెయ్యి. పైగా నీతినియమాలూ, నిష్టాకలవాడు. కందుకూరనే గ్రామంలో కాపురం. బ్రతుకంతా నెల్లూర్లోనూ, ఆచుట్టుపట్లానూ. జిల్లాలో పేరుమోసిన రెడ్లయిళ్ళల్లో ఏవస్తువు చేసినా— అతనిదేబేరం. ఏకార్యకరామతులొచ్చినా వేలకువేలిచ్చేవారు వస్తువులు చెయ్యడానికి. నమ్మకస్తుడని— దగాకోరుకాడని— నికార్సని— ప్రతిష్టసంపాయించాడు. కోటివాళ్ళల్లో గొప్పవాడనిపించుకున్నాడు. బాగా ఆర్జించాడు. అతనికొడుకే సూరాచార్లు. లేకలేక పుట్టాడు. గారాబంగా పెరిగాడు— తండ్రి యెంతవిశ్వప్రయత్నం చేసినా అక్షరం ముక్కబ్బలేదు సరిగదా— సుత్తయినా చేతబట్టడం చేతకాలేదు.

తండ్రి సదాయింటిపట్టునుండకుండా తిరగడం — క్రిందపనిజేసే వాళ్ళమాట లెక్కచెయ్యకపోవడం— ఆకతాయిలా తిరగడం— అలవాటయిపోయింది. ఇలాంటి సమయంలో తండ్రి ఓకులస్థుడికి— ఓవ్యవహారంలో— ఆపదకష్టపడి తన ఆస్తిఅంతా హామీయిచ్చాడు— అది గందరగోళంలో పడుతుందని తెలుసుకొన్న నారాయణాచార్లు— దీపం వుండగానే యిల్లుసర్దుకొంటే మంచిదని— కొడుక్కి పదహారోయేటే పెళ్ళిచేసాడు.

అబ్బాయి పుట్టిన వేళావిశేషంచేత— ఆవ్యవహారంలో ఆస్తంతా సర్వనాశనమయింది— గౌరవం గంగపాలయింది. పేరుప్రతిష్ఠలు మాసిపోయాయి. కుక్కమూతిచూడ్డంలేదు. పూర్వం ఇతన్ని ఆదరించే రెడ్లంతా ముఖంచాటేశారు. నమ్మకం సట్టుటకలిసింది.

అతనుచేసిన పాపకార్యం ఏమీలేదు. స్నేహితుడు— బంధువు— కులంవాడూఅని ఆపదకష్టపడితే— గొంతుకోసేసింది. అది అతని తప్పా— అతడు మునపటి నారాయణాచార్లే— లోకంఅతన్ని ఇప్పుడలా ఎందుకు చూడాలి— వెనక వేనకువేలు బంగారంకొని వస్తువులుచెయ్యమని యిచ్చేరెడ్లు— ముక్కుపుడకచేయడానికైనా బంగారంకొనకూడా యివ్వడానికి సాహసించడంలేదు.

ప్రపంచంఅంతే— డబ్బు— డబ్బుతోనే— మర్యాద— గౌరవం— దర్జా— షోకూ— దిబ్బా— దిరుగుడం— మట్టీ— మశానం— అన్నీ వస్తాయి. ఆచార్లు నమ్మకద్రోహమైన పనేమీచెయ్యలేదు. లోకమే అతన్ని అలామార్చింది. దానికి గౌరవమర్యాదలు తెలియవనే అనుకోవాలి.

ఇక నేమీదిక్కులేక ఆచార్లు నింపాదిగా— ఇదివరకుఇంట్లోనే— స్నానంఅనీ— సంధ్యావందనంఅనీ— దేవతార్చనానీ— దేవుళ్ళాడేనిష్ఠని వీధినిపడేశాడు. పొద్దున్నే లేవడం— స్నానం చెయ్యడం— నాలుగుమూడు

ఘంటలుజపం — విభూతిపిండికట్టూ— గంధాలు తెల్లగ తోపడం— కుడి చేతులో వోర్ఝూరీ— పైనవో పాతపురాణపు శాలువా— మెళ్ళో రుద్రాక్షలు— ఎడంచేతిలో బజార్లో అచ్చువేసి అమ్మే తప్పులుతడక సంధ్యావందనం పుస్తకం— దేవతార్చనవిధి— ముకుందమాల స్మార్తానుక్రమణిక- భగవద్గీత— ఈపుస్తకాలకట్ట—

కనపడిన ప్రతివాడికీ అడక్కుండానే జ్యోతిషంచెప్పడం— నిజాని కతనికి తెలిసింది జ్యోతిషంలో నవగ్రహాలూ— పన్నెండురాసులూ— కాస్తదిరీసు వేసుకున్నవాడు కనబడితే— నమస్కారం పెట్టడం-

ఇంకా బాగానేర్చింది బ్రాహ్మల్నితిట్టడం— బ్రాహ్మలు మాకన్న ఎక్కువకాదు. వారేం పూడబొడిచెయ్యలేదు— మాకూ వేదశాస్త్రాధ్యయ నాలకిహక్కుంది. అంచేత పురోహిత్యం మేము చేయించగలం. రమ్మనండి ఏబ్రాహ్మడొస్తాడో— మొన్న డిప్యూటీకలెక్టరు నాయుడుగారింటో శాంతిచేయించడానికి నన్నే పిలిచారు. పోలీసుసూపరెంటుగారింటో పెళ్ళి నేనే చేయించాను. వారు అసలైన శిష్టకరణాలు.

అని డబ్బా వాయించుకుంటూ— తెలివితక్కువవాడెవడేనా కనిపిస్తే— వాడికి ఉన్నవీ— లేనివీ— ఏవో చెప్పి రూపాయో- అర్థోలాగడం. దానిమీదే జీవనం. ఇటు కావిడిమోసేవాళ్లు మొదలు— అటు పెద్ద భాగ్యవంతులైన శూద్రులయిళ్లకెళ్ళి— నాచేత చేయించుకోండి— బ్రాహ్మడెందుకు— ఏవిస్తే అదేపుచ్చుకుంటానని ప్రచారం— ఏదోమారుమూలో కచోట-తద్దినం పెట్టించి యెల్లాగయితేనేమి- అడ్డెడో- కుంచెడో బియ్యం లాక్కొచ్చేవాడు.

ఇతనివేషభాషలుచూసి- కలస్థులు కొందరు హేళనచెయ్యడం- మరికొందరు- అసహ్యించుకోడం- వేరేకొందరు బ్రహ్మరథంపట్టడం- ఇలా నడుస్తోంది. బ్రహ్మరథం పట్టినవాళ్ళదగ్గర యిలా కోతలుకోసే వాడు.

'మన కులస్థుల యిళ్ళకి బ్రాహ్మణ్ణి దేనికీ పిలవద్దు. మనమే అన్నికర్మలూ చేయించుకోవాలి. వాళ్ళకన్న మనం తక్కువవాళ్ళం గాదు. మనవారందరూ నిష్ఠ, నియమం నేర్చుకోడమే కాకుండా, వేదాలు, శాస్త్రాలూ చదవాలి.

అంటూ యింటింటికీ వెళ్ళి బాకాఖానీవేస్తే, అందులో తెలివి తక్కువవాళ్ళు తలకాయలూపేవారు. వాకట్లోకెడితే- ఏతోటకూర కాడో, ఓ పండో, ఫలమో చేతిలోపెట్టి కానో, అర్ధణో దక్షిణిచ్చేవారు. ఒకపూటుంటే ఓపూటకు లేని అవస్థవచ్చింది. ముసలితనంకూడా దగ్గిరపడుతోంది. కష్టజీవనం చేస్తున్నాడు.

ఇహకొడుక్కైతే పొద్దున్నే లేచివుంటే యింతచద్ది మెక్కెయ్యడం ఊరిమీదకెళ్ళి షికార్లు. పైగా యిటిమీదకేవో దెబ్బలాటలు తేవడం ఇంటిపట్టునుండకపోవడం, పెద్దాళ్ళు కూకలేస్తే తిరగబడ్డం, ఎలానేర్చుకున్నాడో సారా తాగడం అలవాటయింది నింపాదిగా పెళ్ళాం మెళ్ళో వున్న పుస్తెకూడా పట్టుకుపోయాడు అలాంటివేమూలకీ—

కొడుకు ప్రవర్తన తండ్రికి మంటోయింది. పైగా పెళ్ళానికీ వీడికీకూడా కూడెట్టాలి. ముసలాడు ఎక్కణ్ణుంచి తెస్తాడు. అక్కడికీ ఏవో కొట్టుకొస్తూనే వుంటాడు.

సూరాచార్లుకీమధ్య వీరాస్వామనే శూద్రుడితో స్నేహం కలిసింది. అప్పట్నుంచీ తాగుడు మరీఎక్కువైంది. ఇలాంటివి దాగుతాయా తండ్రికి తెలిసి మందలించాడు. అయినా మానలేదు. ఆతాగుడుమైకం లోనే తనకి లేదనగానే సారాకొట్టుకి తీసికెళ్ళి యజమానిచేత చివాట్లు తిని సారాపోయించిన వీరాస్వామితోనే అకారణంగా దెబ్బలాడి తన్నులు తిని చావసిద్ధమై యింటికొచ్చాడు. మంచంపట్టాడు.

మరిరెండు మాసాలకి నారాయణాచార్లు ఈలోకంవిడిచిపెట్టేశాడు. కాని వెళ్ళేటప్పుడు జారీచెంబు, రుద్రాక్షలు, పుస్తకాలకట్ట,

ఇక్కడే పడిలేసాడు. ఇప్పుడు సూరాచార్లుకి మిగిలిన పిత్రార్జితమల్లా అదే.

వీరాస్వామిచేత దెబ్బలుతిని మంచానబడి నెలగ్గాని తేరుకోలేదు సూరాచార్లు. ఈనెలదినములూ అతని కనుకుణమూ- మనమేలువంటి యింట్లో పుట్టాము ఆవీరాస్వామిగాడితో స్నేహమూ— త్రాగుడూ— నా తండ్రి ఎటువంటి మర్యాద సంపాయించాడు. ఛీ! ఛీ! ఇహ నావీరాస్వామిగాడి ముఖంగాని, సారాకొట్టు ముఖంగాని చూడకూడదు

త్రాగుడున్నంతకం చేతనేగదా యిద్దరం అంతస్నేహంగా వుండే వాళ్ళం దెబ్బలాడుకున్నాం— వీరాస్వామి చెప్తేగాని నావిషయంలో— ఎప్పుడడిగితే అప్పుడే అరువో సరువో పెట్టి సారాపోయించేవాడు. నేనంటే పడిచచ్చేవాడు— అతడికి బుద్ధితెలియలేదు. నాకూ అంతే— దానిలోవుంది ఆమహాత్యం అంతా— ఈత్రాగుడువల్ల జమీందార్లే దివాలాలు తీస్తుంటే— నాబోటిచోల్లాయి లెక్కేపటి?

అది ఎముకలు కొరుక్కుని తినేస్తుందిట. తెలుసుండీన్నీ నేనా దురలవాటుచేసుకున్నాను. బుద్ధొచ్చింది— త్రాగేవాణ్ణిచూస్తే స్నేహితులు, బంధువులు, పెళ్ళాంపిల్లలు అంతా అసహ్యించుకుంటారు. తాగడమంటె గొప్పతప్పు ప్రపంచంలో ఇకనేం లేదు.

అని యిక త్రాగకూడదని ఎన్నోఒట్లు వేసికొని నిగ్రహశక్తిసంపాదించ నిశ్చయం చేసుకొన్నాడు. దాంట్లో కొంచెం మనిషి మంచితోవన బడ్డాడు. పాపం ఇంతట్లోకే పాపిష్టివాం తండ్రిని మింగేశాడు ఇదివరకి ఏదోవేళకి కొంపకిచేరి— ఆముసలాడు తెచ్చిన మృష్టాన్నమో— గంజో— కలో— ఏదో తిని తిరిగేవాడు.

తండ్రికి ఉత్తరక్రియలు చెయ్యడానికి ఏగాణిలేదు. ఎల్లాగో పదముందినీ ఆశ్రయించి గెంటేశాడు. ఇప్పుడు సంసారభారం నెత్తినపడింది. తన పొట్ట కాకుండా— భార్యని— ఇద్దరిపిల్లల్ని— తల్లిని పోషించాలి.

ఏంద్రైవమాలని అహోరాత్రాలు కూచుని ఒంటరిగా ఆలోచన్లు చేసాడు. దేవుడేదారీ చూపెట్టలేదు.

నాలుగురోజుల్నించి యింట్లో గిద్దెడు నూకలులేవు. అంతా పస్తే. ఎక్కడికెళ్ళి యేవిధంగా సంపాయించడమో ఏమీతోచలేదు. నాతండ్రి ఉన్న ఆస్తంతా పోయినా సంసారం ఎలాగీడ్చుకొచ్చేవాడా అని దీర్ఘాలోచన చెయ్యగా— జారీచెంబు, రుద్రాక్షలు, పాతశాలువా, పుస్తకాలకట్టా, అతనియెదట ప్రత్యక్షమయ్యాయి.

ఏమనుకొన్నాడో— అదివరకుండే క్రాపింగ్ గొరిగించి పిలక పెట్టాడు. విభూతిపిడికల్లు బాగా దట్టించాడు. తండ్రివేసినట్లుగానే వేషం వేసి నారాయణాచార్లు పోయినట్లు తెలియనివాళ్ళకి అతడేఅని తోచేట్లుగా నడిచేవాడు_ అంగలుఅలాగేవేస్తూ బయలుదేరేడు.

తండ్రికి శాస్త్రాకూస్తో నోట్లోముక్కవుంది ఇదసలేవిశానీవద్దు. ఏమీలేదు తన్నికాస్త పరకాయించి చూచినవాడితో పెద్దకబుర్లుచెప్పడం. ఎక్కడైనా ఏదేనాకార్యం జరుగుతోంటే అక్కడ కూచుని వాళ్ళిచ్చింది తెచ్చుకోడం, యింటిదగ్గర తీరుబాటుసమయంలో అచ్చుపుస్తకాలకట్టలిప్పి నాలుగుపేజీలు తిరగెయ్యడం, ఎక్కడేనా పెళ్ళి మొదలయిన బాజాలు వినిపిస్తే శాలువావేసుకు పరుగు. ఇలాగెంటేస్తున్నాడు రోజులూ—

ఎన్నిచేస్తేనేమిటి ఒక్కపూటకైనా చాలడంలేదు ఆదాయం. ముత్తైవట్టుగుందామూ అంటే శ్రుతిమించిపోయింది. అదిలాభంలేదు. చూశాడు—చూశాడు ఓనాటిరాత్రి బాగా ఆలోచించి ఇహానిక్కడుంటే పొట్టగడవదనీ, దూరంగా పోవాలని నిశ్చయించుకొని యెక్కడికో వ్రాణికెళ్ళి నాలుగురోజుల్లో వస్తానని ఉడాయించాడు. ఇప్పటికి పదిమాసాలయింది. అతీలేదు గతీలేదు.

ఆసంసారం ఎంతకల్లోలంగా వుంటుందో ఆలోచించండి. ఒకతె కన్నతల్లి, వేరొకతె అగ్నిసాక్షిగా పెళ్ళాడినభార్య. ఇద్దరు కనుగందులు. వాళ్ళయిక్కట్లు దేవునకే యెఱుక.

3

'లచ్చనా—సూరాచార్లు కానొస్తరా—ఎక్కడానూ'

'ఏమోరా—ఏమయ్యో కొట్టుకొనిపోతున్నాడేమో?'

'అహా—అక్కడాకవుచేసా—రాడంలేదంట'

'ఎక్కడికిపోయాండో'

'తండ్రి పోయాడు—తల్లి భార్యా పిల్లలూ ఇక్కడేవున్నారు'

'నీకెలా తెలుసు?'

'అళ్ళమ్మనెఱుగుదును. మాంతుస్త్రీయింటకాదూ. ఎప్పుడేనా ఎళ్ళే వాళ్ళంటికి—నాగ్గసపించింది. గొల్లుమందిరూళ్ళేదని. చెప్పకుండాపోయాట్ట.'

'పోనిద్దూ. శనొదిలింది'

'ఒదలడానికేగాని దిట్టచివగోనాను చిత్కొట్టేనా?'

'ఎందుకు?'

'ఏదో తాగుడుమైకంలో కొట్టుకున్నాము'

'బాగాకొట్టావా?'

'నెత్తూరు వరదలైంది'

'తప్పుకాదంట్రా అది'

'అతడివిషయంలో తప్పుకాదు'

'కారణం'

'అతాత్తుగా యిరుచుకొని నామీదపడ్డాడు ముష్టిగో'

'అయితేమాత్రం'

'ఎందుకొట్టానా అని పస్తాయించాను తర్వాత'

'ఇప్పుడేమనుకుంటే ఏలాభంగాని, అలాపోదామా?'

'ఎక్కడికి?'

'భీమయ్యకొట్టుకి'

'నీకింకా తెలవదుకాబోలు. ఆరుమాసాల్నించి నేనావైపుకే పోవడం మానేశాను'

'మరిప్పుడెక్కడ?'

'ఎక్కడాలేదు. తాగడమే మానేశాను'

'ఎవణ్ణమ్మమంటావ్రా'

'నమ్మితేనమ్ము. లేకపోతేలేదు'

'ఈమాటెక్కడేనా వినిపిస్తే'

'సారాకొట్టుదగ్గిరకాదు. అక్కడనికనుపించినా కాలిజోడుతీసుకొట్టు'

'నిజమేనా?'

'భగవంతుడుసాక్షిగా'

'భీమయ్య నన్ను మెచ్చుకుంటాడ్లే'

'ఆడిమెప్పుమండిరి. ఎవడికావాలిప్పుడాడిమెప్పు'

'మొన్నడిగాడు. నాడబ్బు అణాపైసలతో యిచ్చేశాడు. మరాపడంలేదు. ఇంకెక్కడికేనా పోతున్నాడేమోఅన్నాడు'

'నేనూళ్ళోవుంటేగా'

'ఎక్కడికెళ్ళావు?'

'ఏటోమతోయిందిరా. ఉన్నన్నాళ్ళూ యింటోదాన్ని తన్నేవాణ్ణి'

'ఎందుకూ?'

'డబ్బుకోసం. తాగడానికి లేకపోతే'

'ఆడదెక్కణ్ణించి తెచ్చిస్తుంది'

'అలాగేయిచ్చేది పాపం. నాన్నాంతీక తన్నేవాళ్ళి ఇప్పుడేడు స్తున్నాను. అయిల్లాలినుసురుపెట్టానని ఇట్టే యెగిరిపోయింది'

'మరే—జబ్బేమి లేదంట'

'ఏమీలేదు. రాత్రిజారం. పొద్దున్నేచావు ఇంటికాడలేను. నాకోసం కొట్టుకులాడిపోయిందంట. అదిపోయినకాడనుంచి నేనిక్కడ లేను'

'అవును. కనిపించడంలేదేమా అనుకునోణ్ణి'

'అడదిలేనోడు బల్తాడమురా! అందులో మాయిల్లాల్లి. మా ముసిల్దాంతో ఇకనైనా శాగద్దన్నానని చెప్పమందంట'

'సత్తెకాలంమనిషి'

'అంతే. ఏంతెలియదు. తనపనేంటో—తానేంటో'

'నువ్వేడిపించేశావాయిల్లాల్ని'

'నిజమేరా. ఇప్పుడేడుస్తున్నా. ఆయిసారంచేసే దేశాలు దిరుగుతున్నా'

'ఏపట్నోసాలుచూశావు?'

'ఒహాటేంటి తిరపతిఏడుకొండలోణ్ణి, అలివేలిమంగమ్మని—మరి గంటె నెల్లూరురంగనాయకుల్ని, కంచికామాక్షిని, తెగతిరిగేశాను'

'అంత ఎత్తపుట్టిందోటా?'

'ఎత్తేంటి. ఇంకాతిరుగుతా. పోతానేత్రివుమాపిటికి'

'తిరగడానికి డబ్బో'

'డబ్బుకాడద్దుతుందేంటి? నాకు డబ్బెందుకు?

'రైలుఖర్చు—తిండిఖర్చు—పలారాలకి—ఎప్పుడేనా ముండ ఖర్చు—ఎన్నుండాలి'

'ఒరేయ్! ఇంటిదిగుటుక్కు మందంటే మళ్ళీ ఆడదానిమొహం చూస్తే దేవుడితోడు. ఇహచూణ్ణు—దానికేగాణక్కల్లేదు. రైలు ఖర్చంటావా. దర్జాగా ఎక్కెయ్యడమే'

'దింపెయ్యరా పిక్కంటులేకపోతే'

'పిక్కంటేటి నీమొహం. టిక్కట్టనా'

'అదేలే. నోరుతిరగదు'

'దింపేస్తే దిగేస్తాను, మనికోచోట పెగాలనుంటేగా ఎక్కడ బడితే అక్కడేదిగెయ్యడం. కులాసాగావుండడం. ఇంకోరైలెక్కడం ఇంతే'

'అదల్లాకలిసొస్తే తిండో'

'ఎవడోవోడగిపిస్తే ఏదో ఆడిగోక్కొట్టెయ్యడం'

'ఎన్నాళ్ళని'

'ఏదుమాసాల్డియుకొచ్చాను నాంచేతుల్లో పగాస్తేడు'

'తమాషాగావుందే'

'తమాషాలాగే అవుపిస్తుంది'

'చెన్నపట్టం వెళ్ళావా?'

'ఒక్కపాలి కాదు'

'అబ్బా! గొప్పపట్నమంటారు'

'గొప్పదేమనకి. అక్కడాళ్ళకి ఎల్లాటూగే అగి'

'రేవురా తెల్లిటు పయాణం'

'ఇటు. ఉత్తరానికి'

'సూర్యుడు పొడిచేవేపుకా'

'ఇదిరా వుత్తరం'

'సరే. ఇటే గొప్పూళ్ళున్నాయి'

'ఒకటా—రెండా—వందలు—వేలు'

'ముందేవ్వూరు తగులుద్ది?'

'వోల్తేరు—విశాగపట్నం'

'నాకు చాలావింతగావుందిరా. డబ్బులేకుండానే తిరుగుతున్నా వంటే'

'ఔను. దానికదే దేవుడిదయవల్ల. వోస్తోంది—పోతోంది'

'దేశంకానిదేశం. మనజనమూ. మనభాషా మనపలుకూ కట్టవే'

'ఏమో! ఇంతవరకు నేను టిక్కెట్టులేందా రైలెక్కలేదు. ఎక్కనానన్నెవమూదింపలేదు. ఒక్కపూట పస్తుండలేదు. 50 దేవుళ్ళని చూశాను'

'అదృష్టం నీదిరా?'

'నాదేమిటి. ఎవడికైనా నాఅంతే తెగించినోడికి'

'నాబోటిగాడికేదీ లేదు'

'లేదనుకుంటే లేనేలేదు. వుందనుకుంటేవుంది'

'నాక్కూడా దోవచూపిద్దూ'

'చూపేదేమిటీ. ధైర్యంగా బయలుదేరడమే'

'ఎలా పిల్లా జల్లా'

'ఆళ్ళకర్మం ఆళ్ళది. కాని నువ్వొరాదలచుకుంటే ముందు తాగడం మానెయ్యాలి. అదుంటే ఒక్కరోజుగాదే ఒక్కగడియగాదే ఒక్క నిమిషంకూడా జరగదు పయాణంముందుకి'

'ఒదిలేస్తానా?'

'వదిలేస్తానంటేకాదు. రామాయణం నెత్తిమీదెట్టుకొని పమాణం చెయ్యాలి'

'అంతేకాదు. అగ్గిలోవురకమంటే వురుకుతా'

'సరే. అలాయితే రేపుమాపిటికి రడీగావుండు'

'ఏవేంతెచ్చుకోవాలోకూడా చెప్పు'

'పెద్దహడావిడి యేం చెయ్యొద్దు'

'రెండుగుడ్డలేనా వొద్దా?'

'ఏంవొద్దూ—కట్టుబట్టలు—పైబట్ట—ఓలాల్చీ—అంతే'

'చలేస్తే కప్పుకోవడానికి—తడుమోతుకేగుడ్డేనావొద్దా?'

'ఏమీవద్దు'

'ఎలా'

'ఎలాగేమిటి? నీకు రావాలనుంటే — అలాగేరావాలి. ఎక్కడేది రావాలంటే అదేవస్తుంది'

చేతిలో ఎఱ్ఱనేగాణిలేకుండా పయాణంవెల్లారా?'

'ఉంటేపట్టిగెళ్ళొచ్చు. లేకపోతేయెక్కణ్నుంచి తెస్తావు?'

'నువ్వుచెప్పేది నాకేలాగోవుంది'

'సందేహాలెట్టుకుంటే నువ్వురానూలేవు. నాతోవుండనూలేవు'

'రావాలనేవుంది'

'పిరికిలాటమనిషివి. తెగింపులేదు. ధైర్యంవుండాలి ఇలాటి వాటికి'

'దైర్యంగానేవుంది'

'మాటిమాటికీ యింటిధ్యాన్నంవుండకూడదు'

'మళ్ళీ ఎన్నాళ్ళకి రావడం?'

'మళ్ళామళ్ళా రావడానికెదుతున్నామా? ఊతనువులు. దేశ యాత్రిలోనే ఏబగవంతుడెదుటో తెల్లారాలి. అలాటిజ్ఞానంవుంటేనేరా'

'అలాచెప్పు. రేపుమాపిటికే బయదెల్లాలా? నాలుగురోజులుండి పోతేం'

'నువ్వలాటియిది పెట్టుకోనిరావద్దు'

'ఏమైనాసరే రేపుమాపిటికి సిద్ధం'

'నువ్వు వేరేనాతో చెప్పక్కర్లేదు. పదిగంటల్కి రైలుకాడ కొచ్చెయ్యి. నీకిదేచెపుతున్నాను. నువ్వు మధ్యాన్నోవలో తాగుడు మాటెత్తినా—నకిలీవంజేసినా—తెల్లారేసరికి నేమాయమైపోతాను'

'ఇప్పుడే ప్రమాణం చేస్తున్నాను. ఇక రాగుడు మాట తలపెడితే అమ్మతోడు'

'బుద్ధి కుదిరిందా?'

'ఆహా!'

'అయితే జ్ఞానం తెచ్చుకొని నే చెప్పినట్టు బయలుదేరు. నే న్నంగా తిరుగుదాం'

'సరే. రేపు మాపిటికి రైలు కాడ కలుస్తాను'

అని లచ్చన్న తెనదారిని పోయాడు.

వీరాస్వామి యిప్పుడు వెనుకటి వీరాస్వామి కాడు. ఎంతసేపూ దైవభక్తి—దేవతల్ని దర్శించడం—పూజలూ—పునస్కారాలు—పెద్దలతో జ్ఞానులతో—యోగులతో—సన్యాసులతో—సహవాసం— వేదాంతగోష్ఠి— ఇవే ఎంతసేపూను. అతని కావ్యాశ్యాశ్ఛ పూరికొంపోతుంది. దాన్ని మూడోందలకమ్మాడు. ముసలితల్లి వుంది. ఆడబ్బుతో ఆమెను పోషించ మని సర్వానికిమారేసని ముసలమ్మని డబ్బుతో సహా వాళ్ళకప్పజెప్పాలని వచ్చాడు. ఇదితప్పితే అతనికేమీ పీకులాటలేదు ప్రపంచంలో. యథే చ్ఛగా తిరగచ్చు.

మర్నాడు పొద్దుకుంకకుండానే వచ్చినపని నవరించాడు. అక్కడే భోజనంచేసాడు. రాత్రి 9 గంటలకి బయలుదేరి రైలుదగ్గిరకొచ్చి లచ్చన్నరాకకోసం ఎదురుచూస్తున్నాడు.

పదిగంటలుకావచ్చింది. రైలుకింక అరగంటకంటె ఎక్కువ టయములేదు. లచ్చన్నజాడలేదు. అప్పటికప్పుడే ఆరైలెక్కే ప్రయా ణీకులంతా ప్లాటుఫారంమీదికొచ్చారు. వీరాస్వామికూడా ప్లాటుఫారం మీదకొచ్చి ఓపక్కగా రైలుగట్టువంచన ఒంటరిగాకూర్చుని—

ఈసన్యాసి యిన్నికబుర్లూచెప్పి ఎగేసాడు. సంసారంవదిలిపెట్టి రావడమంటే మాటలా. సంసారం మహాసాగరం అన్నారు పెద్దలు.

అది నరకకూపంలాంటిది. బయటికి రానీయదు. పెద్దలజ్ఞానబోధ కొంతకాలంవిని అనుభవానికొస్తేగాని మనసుకట్టుబడదు. అణ్ణాంటున్నాను నేనో — ఆరేడుపూసాల్నుంచి పెద్దలసేవ చేస్తున్నాను. ముసలితల్లి గుండెల్లో మెదలడం మాన్లేదు. అందుకేగదావచ్చాను. ఆడిపూసెత్త కూడదు.

అని లేచి ఓసారి రెండుచేతులూ వెనక్కువిరిచి ముందుకువంగి జయజగన్నాథా అన్నాడు. అంతట్లోకే వీరాస్వామీ అని కేకలేస్తో లచ్చన్న ఓమూలనించొచ్చి కలిసాడు. రైలింకా రావడంలేదు. ఇద్దరూ కలిసి ప్లాటుఫారంచివరకొచ్చారు. టిక్కెట్టుచ్చుకున్నవా అంటాడు లచ్చన్న. రైలుముందోయంటాడు వీరాస్వామి. కళ్ళుతేలేస్తున్నాడు లచ్చన్న.

అంతట్లోకే ప్రయాణీకుల సంఘుగర్జల్ను చేస్తూ తప్పుకోండి—రండి—ఖాళీచేసాను అంటూ రివ్వున వచ్చేసిందిరైలు. ముందు వీరాస్వామి ఆవెనుక లచ్చన్న ఒకేపెట్టెలోనే యెక్కారు. మరిపదినిమిషాల్లో పోదాం పదండి అని రైలు బయలుదేరింది.

లచ్చన్న వీరాస్వాములు ఆరైల్లోకూర్చుని ఊసులుచెప్పుకుంటున్నారు. లచ్చన్నగుండెలు కొట్టుకుంటున్నాయి. వీరాస్వామి ఏవోభక్తి సంబంధమైన కబుర్లుచెపుతున్నాడు. రైలు శరవేగంతో పొద్దుపొడవకుండా వాల్తేరుచేరింది. ప్రయాణీకులు ఎక్కుతున్నారు—దిగుతున్నారు—మనవాళ్ళిద్దరూమాత్రం కదల్లేదు — ఆరైలెంతవఱకెడుతుందో అంతవరకూ పోతారుకాబోలు.

———

‘ఎందుకు పడతాయి?’

‘దెయ్యం విసురుతోందని వాళ్ళంటారు’

‘సర్వాబద్ధం’

‘ఇంకా తోటల్లో పిల్లల్ని మాయమవడం’

‘దాచేస్తారి’

‘నీదంతా విపరీతవాదన’

‘నే చెప్పేదంతా యథార్థం’

‘ఇంకా స్వామివారిమహాత్మ్యం చెపుతావిను’

‘కానియ్యి’

‘ముఖం చూసి మనస్సులోనివీ అన్నిసంగతులూ చెప్పడం’

‘ఇదొకడాబు’

‘ఎలా చెప్పగలుగుతాడు?’

‘ఏవో కొన్ని కబుర్లునేర్చివుంటారు కనుకనే వాళ్ళు. ఇటువంటి మాటలు గింగిబాలానేసరికి ఎదటిమనిషి మనసులో ఏవో నాలుగో—మూడో సంబంధించివుంటాయి’

‘అంతమాత్రంచేతనే’

‘చెప్పేదంతావిను. సాధారణంగా యిటువంటి వాళ్ళదగ్గిరికి మనస్సు చికాకుగావుండేవాళ్ళే ఎక్కువమంది వెడతారు. ఏవో వ్యవహారప్పు చిక్కుల్లో ఏవోవుంటాయి. గాడుపలికేపలుకుల్లో రెండు మూడు తనకిసంబంధించేటప్పటికి ఒడలు తెలియని సంతోషంతో ఈమనిషే చెప్పేస్తాడు. వాళ్ళుచూపితే పుచ్చుకుపోయేరకం— తలవెంట్రుకవాసి వెళ్ళినమనిషి జారిస్తే—దానిపట్టి ఏనుగంతవేసి మాటలుగాపెంచి చెప్పేస్తారు. ఇదీతంతు’

‘అదేమోగాని 20 రోజుల్నుంచి చూస్తున్నాను. జనంతీర్థప్రజల్లా వెళ్ళడం రావడం గోవిందాడుక్కీ అందుకుమాటలే—ఆడాళ్ళే కాదు. మగాళ్ళే

కుతుండగా యింటికొచ్చింది. అత్తగార్ని చూడ్డంతోటే కోడలు ఎగిరి గంతేసి, ఒక్కఅంగలో ఎక్కడో దాచినఉత్తరం తెచ్చి చదివివినిపిస్తూంది.

తల్లిగారికి నమస్కారములు:—

నేను నాలుగురోజుల్లో వస్తానని యిల్లువిడిచిపెట్టివచ్చి యిప్పటికి సుమారు 18 మాసాలయింది. నేను మీఉపవాసాలు చూడలేక, పిల్లల ఆకలిబాధ చూడలేక, మనస్సువాడిపోయి, ఏమీతోచక వచ్చేసాను. ఎక్కడెక్కడో తిరిగిప్పటికి శ్రీకాకుళం చేరుకున్నాను నేనేమిచేస్తున్నానో ఎలాసంచరిస్తున్నానో, అదంతా మీరెవ్వరికీ వాకబుచెయ్యొద్దు మీకు ఎప్పుడుడబ్బు- ఖర్చుగా ఏమికావలెనో యీక్రిందవ్రాసిన అడ్రసుకు వ్రాస్తే పంపిస్తాను. ప్రతినెల 1 వ తేదీకి 200 మనియార్డరుచేస్తాను మీరు చాలా చిక్కులుపడుతూంటారని 500 ఓకవర్లో పెట్టి ఇన్స్యూరుగా పంపించాను. అదిమీరుతీసుకుని ఖర్చుపెట్టుకొని హాయిగా వుండవలెను. పిల్లలను జాగ్రత్తగా పెంచవలెను. నేనెప్పుడువస్తానో చెప్పలేను మీరు దేనికీ చిక్కుపడవద్దు. నాకోసం బెంగపడవద్దు. నేను హాయిగావున్నాను. మీరుకూడా అలాగేవుండండి ఎప్పుడేదికావలసినా వ్రాస్తే వెంటనేపంపిస్తాను. నాలుగురోజుల్లో పదిచీరలు, పిల్లలకు గుడ్డలు, పడజామాగ్గు దుప్పట్లు అన్నీ రైలుపార్శిలుగా పంపుతాను. ఓప్యాసు మీకువస్తుంది. దానికేమీ డబ్బుకట్టక్కరేదు. ఆపానుతీసుగొని స్టేషనుకెడితే పార్శిలు మీకిస్తారు. ఇంతేసంగతులు. ఉత్తరములు ఇతరులకు చూపవద్దు. ఇతరులచేత నాకుత్తరములు వ్రాయించవద్దు. మీకోడలినే వ్రాయమను. పిల్లలక్షేమం ఎప్పటికప్పుడు తెల్పవలెను. ఇక్కడ నాపేరు యతిరాజు అంటారు. ఆపేరుతోనే మీరుత్తరం వ్రాయాలి

సూ రా చా ర్లు

చిరునామా:—

కందుల గణనాథం,
యతిరాజస్వామిశిష్యుడు,
శ్రీకాకుళం

ఆ తల్లి కొడుకు వ్రాసిన ఉత్తరం కోడలు చదువుతూంటే విని కొంతసేపు కన్నీరు కార్చింది. మరికొంతసేపు ఆనందబాష్పాలు రాల్చింది. భార్యమాత్రం చిరునవ్వు మొగంతో ఏకధాగాటినేవుంది. పిల్లలుమాత్రం నాన్న—ఉత్తరం—ఏదీ—అంటూ కేకల్లాడారు.

ఆమరునాడే పై చిరునామాకు సూరాచార్యులతల్లి కొడుక్కి కోడలి చేత, నాయనా! ఇప్పటికైనా యిల్లంటో—పెళ్ళాంబిడ్డలంటో—తల్లంటో జ్ఞాపకంవచ్చింది. నిన్ను చూడ్డానికి మాకళ్ళు కాయలుకాసిపోయినాయి. ఒక్కసారివచ్చి నాలుగురోజులుండివెళ్ళు. మేమంతానింపాదిగావున్నాం. పిల్లలు—నీభాగ్యాన పెరిగి పెద్దగున్నారు. తిరువాతిసియుష్ఠం — అని వ్రాయించింది.

తర్వాత డబ్బు—బట్టలపార్సెలూ—అందింతర్వాత మళ్ళీ వ్రాయించింది. ఈఉత్తరాలు చేరుతున్నాయి యతిరాదస్వామికి. వారుత్తరాలు వీరికి—వీరుత్తరాలు వారికి చేరుతూనే వున్నాయి. ఈసమాచారమంతా గణనాథానికితప్ప ఎవ్వరికీ తెలియదు.

౫

'గురూ—వీరేశా—నీదయవల్ల చాలాదేశం చూచాను'
'నాదయేముంది—నీపూర్వపుణ్యానుకృతం"
'అలాగనద్దు'
'నీకన్న నాదగ్గిరున్న గొప్పతనమేముంది?'
'నువ్వు వెనుకటి వీరాస్వామివిగావు—ఇప్పుడో దేవుడివి'
'అదే వ్యక్తితనము—దైవకృపప్రధానంగాని—మానవునిదయెంత'

'అలాకాదు – నా జన్మలో ఎప్పుడైనా – జగన్నాథస్వామిని చూడగలనా? కలకత్తాలో అడుగుపెట్టగలనా? కాశీవిశ్వేశ్వరుని దర్శింపగలనా?'

'తొలిజన్మలో చేసినపూజ'

'అయోధ్యలోని శ్రీరామచంద్రుని దర్శనం చేయించావు— ప్రయాగలో త్రివేణీసంగమం కళ్ళబడింది. అలహాబాద్ మొదలైన పట్టణాలెన్నైనా నాకేటిలేదే? నువ్వు నాపాలిటిదేవుడివి'

'ఇంకానువ్వు మారుత్రోవ నేవున్నావు. భగవంతుడే నీకీబుద్ధి పుట్టించి నాదగ్గరకి రప్పించినాడు'

'ఇంతో నా జన్మ తరించింది'

'అదో పిచ్చియూహ-మనం చూసి ది ఆవగింజలో ఆరోభాగంలేదు'

'ఒక్కమాట నీతో చెప్పడానికి భయపడుతున్నాను'

'ఏమీ సంశయించక చెప్పు'

'నాకొక్కమా రింటికివెళ్ళి రావాలనే బుద్ధికలిగింది'

'అలాగ మతిచలించినప్పుడు వెళ్ళిపోవాలిసిందే'

'మనస్సులో ఒకవిధమైన ఆశపుట్టింది'

'తప్పక యివేళేబయులుదేరు'

'నువ్వు—కాదు—మీరొక్కడికివెడతారు'

'అదినేను చెప్పలేను—నాతో రావనాదే—నీతో రానిదే'

'ఆగ్రహంవచ్చిందా నామీద'

'ఆగ్రహంకాదు—అనుగ్రహంకాదు'

'అలా సెలవిస్తారేమి?'

'నీకు చెప్పవలసిందే చెప్పాను'

'మనస్ఫూర్తిగా వెళ్ళమన్నారా?'

'నీకలాటిబుద్ధి పుట్టకనేపోవాలిగాని—నేనాపితే ఆగుతావా?'

'మీరొద్దంటే మానేస్తాను'

'అలా ఎప్పుడూ అనద్దన్ను'

'వెళ్ళమంటే వెడతాను'

'అదీ చెప్పను—నేను చెప్పవలసినమాట ఆదిలోనే చెప్పాను'

'నాటేసి గురిగా పెట్టుకొనే యింతవఱకు తిరిగాను'

'గురితప్పినప్పుడిక లాభంలేదు'

'గురితప్పలేదు—ఏదో ఒకవిధమైనవాంఛ'

'ఆ వాంఛ కలిగితే—ఇతరుల ఆలోచన పనికిరాదు'

'అయితే బయలుదేరమంటారా?'

'నన్నా విషయంగురించి అడగొద్దు'

'నేను చిక్కులో నేపడ్డాను'

'ఏమీ చిక్కులేదు'

'మిమ్మల్ని వదలాలనీ లేదు—ఇంటికిపోవాలనీవుంది'

'మనస్సును రెండుమార్గాలుగా తిప్పకూడదు'

'అది నిగ్రహించుకునేశక్తి కలగలేదు'

'ఇంకా కొంతకాలానిక్కాని కలుగదు'

'ఎంతకాలంపడుతుందో'

'ఎవరు కాలనిర్ణయం చెయ్యగలరు—పెద్దలసహవాసంచేసి జ్ఞానార్జనచెయ్యాలి?'

'మీకన్నా పెద్దలెవ్వరునాకు'

'నేను పెద్దనని అనుకోను—మనమిద్దరం సమానులమే'

'ఎప్పటికీ కాదు'

'ఆ ఊహాపొరపాటు'

'పొరపాటని నామనస్సు చెప్పటంలేదు'

'నీమనస్సు నీఅధీనంలో లేదు'

'కలిగిపోయినమాట వాస్తవమే'

'నీమనసు తిప్పినప్పట్టేవన తిరుగును"

'ఇంటికివెళ్ళిరమ్మని బోధిస్తోంది'

'మనకిల్లవేదిలేదు—హృదయమేయిల్లు

'నిజాని కంతేగాని—అది కుదుటపడటంలేదు'

ఇంతలో కుదుటపడదు'

'అయితే నేను వెళ్ళడానికే నిశ్చయించాను'

'శుభస్యశీఘ్రం'

'శుభమో—అశుభమో—తెలిసినగదా?'

'శుభాశుభములకు భేదమెంచమజ్ఞాని'

'జ్ఞానావబోధవలసంగ్రష్టసాధ్యములైనవి సులభముగాం దేలి యుట సంభవమా?'

'కాదు'

'నేనిప్పుడు బాడికి వెళతాను'

'అలాగే—కానియ్యి'

అని వీరాస్వామి లచ్చన్నను బాడికి పంపినాడు. పూర్వకర్మఫలి పక్వము కానందున నతనికింటిపై ధ్యాసకలిగింది. దానిని మరల్చఆదేవుని కూడ శక్యముగాదన నాబోటి నీచునకు తరమా?

అనుకుంటూ మెల్లగా బసకుచేరుకున్నాడు.

వీరాస్వామి లచ్చన్న లోకేమారు బయలుదేరారు. ఏమేమి యుపాయాలున్న తిప్పాడో గాని—చేత చిల్లిగవ్వలేకుండావచ్చిన మిత్రున్ని నాల్గుమాసాల్లో అనేక క్షేత్రాలుతిప్పాడు. మహానగరాలని చూపాడు. ఏమైతేనేమి మనోనిగ్రహంలేక లచ్చన్న యింటికిపోయాడు. వీరాస్వామి తిరిగి జగన్నాథంవచ్చి — అక్కడనుండి కళింగదేశం చూసుకుంటూ శ్రీకాకుళానికి దగ్గరగావున్న శ్రీకూర్మం జేరుకున్నాడు.

అనట స్వామినిదర్శించాము. తిరిగి ముఖ్యముఖ్యంగా ఉత్తరదేశ యాత్ర చేతామని అనుకుంటూండగా శ్రీకాకూళంలో యతిరాజస్వామనే ఒక మహానుభావు డున్నాడనివిని యతినిసేవచెయ్యకుండా వెళ్ళరాదనే ఉద్దేశంతో శ్రీకాకుళం చేరి యతిరాజస్వామి దర్శనార్థంవచ్చిన ప్రజనిచూచి ఆశ్చర్యపడి తామకూడా వారిలో కలిసిపోయాము. అక్కడకు వెళ్ళినదగ్గిరనుండి, ఆస్వామిని చూస్తామని, వీలైతే ఆయనకు శుశ్రూషచేసి అక్కడేవుండిపోదామని నిశ్చయించుకొని వేచియున్నాము.

మొదటినాటి సాయంకాలం దర్శనానికి వచ్చినజనమంతా వెళ్ళిపోయారు. ఆసమయంలో వీరాస్వామి లోపలికివెళ్ళి స్వామికి సాష్టాంగనమస్కారంచేసి తనఉద్దేశం తెలిపాడు.

వారిద్దరూ చాలకాలం నేస్తాండ్రైయినా ఇప్పుడేకర్నొకరు పోల్చుకొనే పరిస్థితుల్లోలేరు. తమసేవచేసి తరించాలని తానుకూ వచ్చాడని వీరాస్వామి దోసిలొగ్గి తెలుపుకొన్నాడు. మావద్ద సేవకు శాశ్వతంగా వుండే శిష్యుల్ని కొంతకాలం వారి దే ఆత్మజిజ్ఞాసాదులు పరీక్షించిగాని అంగీకరించము కాబట్టి నివు తాత్కాలికశిష్యకోటిలో చేరవలసిందని స్వామి సెలవిచ్చారు. అందులకంగీకరించి వీరాస్వామి యతిరాజస్వామి వద్ద శిష్యుడుగా ప్రవేశించాడు.

'దామోదరం గుడ్‌మార్నింగ్'

'గుడ్ మార్నింగ్ గౌరీనాథ్'

'అంతమూలమనోయి—గవరియ్యా అంటు'

'నామనస్సల్లాఒప్పుకోడం లేదు'

'దానికేంగాని ఆస్వామినిదర్శించి వచ్చావా?'

'దర్శించిరావడమేకాదు. ఆమహామహుని మాహాత్మ్యం అంతా విశదంగా తెలుసుకొచ్చాను. చెపుతున్నా విను'

అంటూ దామోదరం గవరయ్యతో ఆస్వామిపేరు యతిరాజ స్వామి. అక్కడున్నజనసందోహాన్నిచూస్తే మీఅపోహతొలగిపోతుంది. అతడు కేవలము పరమాత్ముడేకాని నరుడుకాడని వేలకొలదిజనులు దర్శనానికొచ్చుకొచ్చున్నారు. నిన్నటిరోజున నేను వెళ్ళేసరికి అక్కడ పదివేలేనాజనం వున్నారు. నాకు దర్శనం ముందంటె నాకు ముందని తొక్కిసలాడుకుంటున్నారు.

'ఇంతకీ నువ్వెళ్ళిచూచి వచ్చిన ఆస్వామిమహాత్యం ఏమిటో చెబుదూ'

'మీరడుగడుక్క నన్ను అనుకున్నాపాకరిస్తే నేచెప్పేదెట్లా?'

'లేనులే. కానియ్యి'

'నేనెలాగో జనంలోంచి తోసుకుని గంటన్నరసేపు తంటాలుపడి స్వామిసన్నిధానానికి చేరాను'

'అయితే నీజన్మతరించినట్లే'

'మీకాగ్రహంవస్తే నేచెప్పలేనుగాని అక్కడివింత సంఘటనలు చూస్తే నాకిప్పుడలాగేతోచింది'

'నీవుకూడా ఏ బుషివై పోతావు కాబోలు'

'ఈవైధవసంసారలంపటంలోకంటె స్వామిసన్నిధానాన్ని ఉండగలిగితే ముక్తో—రక్తో సిద్ధించితీరుతుంది'

'రక్తసిద్ధించటం యదార్థం. ముక్తిమాట నేచెప్పలేను'

'స్వామి నాకు ప్రత్యేకంగా దర్శనం యివ్వకపోయినా ఆయనకి 2 గజాల దూరంలో నిలబడి ఆయన పరతత్వరూపాన్ని చూడగలిగాను'

'ఇవతలకొచ్చి రెండుకప్పులేనా కాఫీతాగావా?'

'చెప్పనివ్వండి. నేనువెళ్ళేసరికి ఒక గొప్పఉద్యోగస్తుడికేదో చెపుతున్నాడు'

'అది వినబడలేదాయేమిటి?'

'సావధానచిత్తుడూనా అల్లంతదూరంలో చేతులుజోడించుకునిలు బడిన నాకు వినబడకపోవడమేం కర్మం. ముందుగా ఆయన్నిపిలిచి ఓ మాటు మొగాడిగానాంది మూడో పెళ్ళి మొంగునావు? ఆపిల్లగతేమ వుతుందనుకున్నావు అన్నాడు'

'అంతథాట్ రీడరా?'

'దాంతో ఆయన తెల్లమొహంవేసి చిత్తం పొరబాటుచేశానని చెంపలు వాయించుకోబోతే—'

'రెండుచేతులూ పట్టుకున్నాడు?'

'మరేంభయంలేదు. నేను చక్కబరుస్తాను. ఆమె నా సాన్నిధ్యంలో మూడహోరాత్రాలుండంటే నీయెదుట పిల్లయిపోతుందన్నాడు'

'పిల్లవుతుందా పిల్లలతల్లవుతుందా?'

'అలాంటిదూషణవాక్యాలనకండి?'

'కానియ్యి'

'ఆయన నమస్కరించి రేపుసాయంకాలం హాజరుపెడతానని వెళ్ళిపోయాడు. తర్వాత ఓ పాతికేళ్ళయువతి స్వామిపాదాలదగ్గిర వ్రాలి పాదవందనంచేసి ఎంతసేపటికీ తనివితీరక లేవలేదు. అప్పుడు స్వామి ఆమె రెండుజబ్బలూ పట్టుకొని లేవదీసి—నీభర్తవల్ల నీకేటిఅపకారమూ జరగదు. సంశయింపకు. కొద్దిరోజుల్లో బాగుపడుతుంది. ఇంకా తొందరగా నీకోర్కె నెరవేరాలంటే నువ్వు నావద్ద త్రిరాత్రిదీక్ష పొందాలి.

అని చెప్పగానే ఆమె తిరిగి స్వామికి సాష్టాంగపడి పదేపదే స్వామికేసిచూస్తూ వత్తిపళ్ళెం చంకనెట్టుకొని జారిందిబయటికి—

'ఇంకా అన్నీవింతలూ విశేషాలూను'

'మరోగడియకి స్వామివారు రోజూ తమకువచ్చే జాబులు ఓ ప్రియశిష్యుడు చదువుతుంటే—ఆయన ఊకట్టడం—వాటికి సమాధానాలు

రాయించడం జరిగేటయుమాట. అంచేత వారిశిష్యుడొకడక్కడున్న జన మందఱికీ ఆచావుకబురు చల్లాగా జారేసాడు'

అక్కడచేరిన జనం చెప్పుకునేమాటలువింటే మీారు తెల్ల బోతారు. ఆకానుకలు—కట్నాలూ—చదివింపులూ—చూసారంటే దంగై పోతారు. మీాలాంటివారు తప్పకచూడాలి అన్నాడు దామోదరం.

'దూడక్కర్లేదోయీ—నువ్వుచెప్పిన మాహాత్మ్యంవల్లనే ఆయన యెంతమహానుభావుడో తేలింది'

'అలాయెంచుకోవలసిందే'

'అవును. అటువంటి మహానుభావుడు కాకపోతే అంతమంది జనంలో సాహసంగా తనకు నమస్కరింపవచ్చిన స్త్రీని జబ్బలట్టుకు లేవదీస్తాడా?'

'స్వామినవమానిస్తున్నారు'

'ఆపని నేను చెయ్యడంలేదుగాని ముందు కొద్దిరోజుల్లో జరగ బోతుంది. పొద్దుపోయింది పోతానింటికి'

'తమరోసారి తప్పకదయచెయ్యాలి. ఎప్పుడువెడదాం?'

'నీకోరికతప్పకుండా తీరుస్తాను—పదిరోజులుపోనియ్యి'

అంటూ గవరయ్య యింటికెళ్ళిపోయాడు దామోదరంకూడా నిజగృహాభిముఖుడయ్యాడు.

గవరయ్య పోయేమార్గమధ్యంలో స్వామివారిని సేవించివచ్చే పదిమందాడాళ్ళు ఆడదగిలారు. వాళ్ళుముందర— గవరయ్య వెనకాలా వెడుతున్నారు. ఆజనంలోవున్న ఆడామెఒకర్తె రెండోఆవిడితో—

'అమ్మామయమ్మా! స్వామికెక్కడా అరమరికేలేదు'

'మహానుభావుడు—అవతారపురుషుడు'

'అవతారపురుషుడు కాకపోతే చూచీచూడ్డంతోటే సంగతులన్నీ చెప్పేస్తాడా?'

'అదల్లావుందమ. ఎంతెంతగొప్పవాళ్ళొస్తున్నారాయన దగ్గిరికి'

'గారటమ్మా—ఎంతెంతడబ్బు గుమ్మరిస్తున్నారో ఏంగాకావా?'

'మొన్నటికేం. ఇందాకావచ్చిన కోమటావిడ 20 పెద్దకాసు లిచ్చింది'

'ఎందుకో'

'ఆవిడికి సంతానంలేదుట—తనసేవలో మూడురోజులుంచుకుని మంత్రోపదేశం చేసార్ట— పదిహేనురోజులయిందిట— అప్పుడే చిన్నెలు కనుపిస్తున్నాయట'

'ఆయనసేవలో ఉండటమంటే'

'రాత్రి ఆయనకు ఫలహారం పెట్టడం—లేవగానే తాంబూలమివ్వడం— కాళ్ళుపిసగడం—ఇల్లాటివి'

'ఆసమయంలో ఇంకా ఎవరేనాభక్తులుంటారా?'

'అప్పుడింకెవరుంటారూ— శిష్యులుకూడా లోపలికెళ్ళడానికి వీల్లేదు మళ్ళా తెల్లారేదాకా'

'తెల్లవార్లు సేవచెయ్యాలన్నమాట'

'అలా మూడురోజులు'

'మామఅదలుందమ్మా—తీసికొచ్చి చూపించాలి'

'ఎన్నేళ్ళుంటాయి'

'ఏం—ఇరవై రెండుంటాయి'

'పెద్దవయస్సువాళ్ళకి ఉపదేశం చెయ్యర్ట'

'రేపు తీసుగొస్తాను'

'ఇక్కడేవుందా'

'ఆ—ఆ అమ్మాయి మొగుడికిది నాలుగోపెళ్ళి — అరవైయేళ్ళు దాటుంటాయి. గొప్పవుద్యోగం'

'వృష్యకలాభిస్తుందా అమ్మాయికి—కాని మనిషి రూపసేనా?'

'తాపసి కాకపోతే—ఉపదేశం చెయ్యరా?'

'తాపసయి ఉండాలి—యౌవ్వనంలో వుండాలి— లేకపోతే చెయ్యరు. మొన్ననో 20 ఏళ్ళపిల్ల వచ్చింది. నిన్ననో 45 ఏళ్ళావిడొచ్చింది. వీరితో స్వామి మాట్లాడరు పొమ్మన్నారు శిష్యులు.

'వాళ్ళంతో నిరుత్సాహపడి వచ్చిందార్నే పోయారు. నేనిలా వెడతానమ్మా. నేనుకూడా వెళ్ళొస్తాను'

గవరయ్య ఇదంతా ఊకొడుతూ— తలపంకిస్తూ—తనయిల్లు చేరుకున్నాడు.

---

౬

వీరాస్వామివారి శిష్యుడై యిప్పటికి రెండుమాసాలయింది. ఆయనచర్యలన్నీ కనిపెట్టిచూస్తున్నాడు. చూడగాచూడగా అతనికి చాలా అనుమానాలు కలుగుతున్నాయి ఏదో సరిపెట్టుకుంటున్నాడు. అయితే స్వామివారికితడు ఆంతరంగిక మిత్రుడు కాకపోయినా బాగా చనువుగామాత్రం ఉన్నాడు.

ఓనాడు స్వామిఉత్తరాలు వ్రాసీయించి పోస్టులో పారెయ్యడానికి వీరాస్వామినంపాడు. అందులో ఓచిరునామా చూచేసరికి గుండె గుభేలుమంది. దాంతో అతనిఅనుమానం బలపడిపోయింది. అయినా యింకా పరీక్షించి చూస్తేనేగాని నిర్ధారణచేయలేనని ఓకంటకనిపెట్టి చూస్తున్నాడు.

జనమంతా అవ్వేళ పెందరాళే స్వామిఆజ్ఞమీద వెళ్ళిపోయారు. వీరాస్వామి స్వామిసమ్ముఖాన నిలబడిచూస్తున్నాడు. నలుగురుస్త్రీలు కట్నాలూ, కానుకలూ పట్టించుకొచ్చారు. నలుగుర్నీ రాత్రికుండమన్నాడు

వారంగీకరించి స్వామిచెప్పిన ప్రకారంగా తాముండవలసిన ప్రత్యేకస్థానాలలోకి వెళ్ళిపోయారు.

స్వామి వీరాస్వామిని చూచి— నీవొచ్చి యెంతకాలమైందని అడిగితే— మూడుమాసాలు దాటిందన్నాడు. అయితే నువ్వు రోజూ ఏంపని చేస్తున్నావని తిరిగి అడగ్గా— ఏముందండీ— గణనాథంగారు చెబితే అదే చేస్తున్నాను. కాని తమసేవచేసేభాగ్యం లభించలేదు——అని వీరాస్వామి అనగా——

'నాకు నువ్వేంజేస్తావు?'

'తమ సన్నిధానాన్నుండి తమకేవిధమైన శ్రమా లేకుండా చూడడం— తాము కొంచెం అలసివుంటే— ఆశ్రమతీర్చడం— తమవల్లవద్దనా యింతగోష్ఠి వినతెరించడం— అదేనాకోరిక'

'అయితే రేపట్నుంచి నువ్వస్తమానమూ నావద్దేఉండి పగలు భక్తులుతెచ్చిన కానుకలందుకోడం— రాత్రి నేనుపిలిచినప్పుడుమాత్రమే నాగదిలోకివచ్చి కాళ్ళుపట్టడం— ఇదే నీవునాకు చేసేసేవ'

అని స్వామిచెప్పి యిక వెళ్ళమనగా— నేను జపంలోకూర్చోవాలని వెళ్ళిపోయాడు.

అనంతరం వీరాస్వామి బయటికొచ్చి— నేనువచ్చి మూడుమాసాలయింది. ఈస్వామినోటంట ఒక్కతత్వవాక్యం వినలేదు. ఎంతసేపూ కానుకలూ— కట్నాలు— పైగా స్త్రీలు రాత్రిపూట రావడం— ఇదంతా నాకెలాగోవుంది— కాలం ఇక్కడ వ్యర్థంచేశాను— సరేచూస్తాను రేపటి నుంచి సన్నిధానాన్నుంటానుగదా!

అని ఆలోచిస్తూ అలాగేఉండిపోయాడు. నడిజామైనా అతడు నిద్రపోలేదు. ఈవేదాంతగోష్ఠిలో పడ్డతర్వాత - నిద్రలేదు— ఇవ్వేళ కునికిపాట్లుకూడాలేవు. అలాగేచూస్తున్నాడు.

స్వామివారు రాత్రి జపం చేసుకునేగదికి ఎదురుగావున్న హాల్లో కూర్చున్నాడు అయితే అక్కడ రాత్రివేళ మసలడానికొక్క గణనాథానికే అధికారంవుంది. అవ్వేళ గణనాథం ఏదోపనిమీద స్వామితో చెప్పకుండా గ్రామంలోకెళ్ళాడేమో— అతడింకా రాలేదు. అతడుండేచోటనే వీరాస్వామి కూచున్నాడు.

ఇంతలో— గణనాథం అని పిలుస్తూ స్వామి బయటకొచ్చాడు. ఆకూర్చున్నది గణనాథమేనని స్వామిఅనుకుని— దగ్గరగావచ్చి— ఇవ్వేళ వచ్చిన ఒక్కఆడదీ లొంగలేదోయి— పైగా వాళ్ళమాటలుచూస్తే మన బండారం బయలుపడేట్టుంది— అని చెవులో చెప్పాడు. ఆమాటలువిన్న వీరాస్వామి కొయ్యబారాడు. స్వామివారు పట్టంచు సేలంపంచకట్టుకొని ఒంటినిండా గంధంవగైరాపూసికొని — వేశ్యాగృహంలో — ఆమెకాళ్ళా వేళ్ళాపడేవిటుడువలె వున్నాడు.

అపుడు నేను గణనాథాన్ని కాదండి. వీరభద్రుణ్ణి. అనడంతోటే ఇక్కడెందుకున్నావు? అవతలికిపో అని అరిచి లోపలకుపోయాడు. వీరాస్వామి అక్కణ్ణుంచి కదల్లేదు. కాని కాస్తయింకాచీకటిలోకి జరిగాడు.

మరోపదిహేనునిమిషాలకి గణనాథం సీసాతో ఏదోపట్టుకొచ్చి స్వామితలుపు తట్టాడు. స్వామి తలుపుతియ్యడంతోటే యిద్దరూ లోపలికి పోయారు. వీరాస్వామికిదంతా వింతగాకనిపించింది. మొదట తాను కూర్చున్నస్థలంలోకొచ్చాడు. లోపల్నుంచి మాటలు వినిపిస్తున్నాయి.

'గణనాథం మనమిక్కడనుంచి పదిహేనురోజుల్లో దాటిపోవాలి'

'ఏమంతతొందరొచ్చింది?'

'ఏంపెద్దప్రమాదంకాదుగాని యివ్వేళొచ్చిన ఆడాళ్ళునలుగురూ కూడా దేవాంతకురాండ్రే'

'ఏంజరిగిందేమిటి?'

'మంచిదెమకాయి పులో ఎలావెడతాం'

'న్నైనె నాచూసి చాలారోజులయింది— మొన్న మామ పినడబ్బు 2 వేలతోను కొంపకొన్నారుట. బాగానేవుందిట— రేపు సిల్వవున్న 4 వేలు పంపెయ్యాలి — మిగిలినబంగారం చీర్లువగైరాలు వెళ్ళావుడే పట్టిగెడదాం'

అని చెప్పాకునేమాటలన్నీ పీరాస్వామికి వినిపించాయి కాని గిందరగోళం పడుతున్నాడు—

'వినవోయి— అపీరాస్వామి ఓరోజున నన్నుతన్నాడు. అప్పటి నుంచీ విడిపోయాం— ఎక్కడకిపోయాడో తెలియును'

'వాడిసంగతిప్పుడెందుకూ?'

అని చెప్పునున్న మాటల్లో పీరాస్వామికి మతిపోయింది. సగాగా భార్గుకాకుండావుండడు. ఇంకా సందేహమెందుకు— వీడీవేసంవేసి యెంత డబ్బార్జించాడో— ఎప్పటిదప్పుడే యింటికిబంపుతున్నాడు. ఈసంగతంతా పసికట్టిన పీరాస్వామికి— స్వామంటేవీడా— వెధవజన్మ— ఇలాంటిపనులా. ఎంతదేశద్రోహం— ఇటువంటివాళ్ళని పట్టిస్తే బాగుండునుగాని— నాకెం దుకు— నాలుగురోజులు కళ్ళుమూసుకొని— ఇక్కడినుంచి పోతానను కుంటూ అక్కడనుంచి బయటకుపోయాడు. ఎక్కడపడుకున్నా నిద్రపట్ట లేదు. అల్లాగే గుమ్మలేనికూర్చుని తెల్లారేముందు పడుకున్నాడు. కాని పదిగంటలయినా మెలుకువరాలేదు. అప్పుడు స్వామివారిని చూడ్డాని కొచ్చిన జనుల కోలాహలానికి మెలుకువొచ్చిలేచాడు.

రాత్రి స్వామివారి దర్శనానికొచ్చిన స్త్రీలలో ఒకావిడ అవూళ్ళో పెద్దఉద్యోగస్థుడైన ఒకనాయుడుగారికూతురు. వయస్సు యిరవై దాటుంటాయి. చాలాఅందగత్తె. ఆమెకి సంతానంలేదు. ఇంటి దగ్గర తల్లితోచెప్పి యిరుగుపొరుగువాళ్ళు— స్వామిని దర్శించి సంతాన భిక్ష వేడుదామని నుగాళ్ళని బుట్టలో పెట్టివస్తూంటే తనుకూడావచ్చింది.

స్వామి ఏదో చిట్కానో— తాడో— తంత్రో యిస్తాడనుకుంది కాని గదిలోకి తీసికెళ్ళి బలవంతం చేస్తాడనుకోలేదు. తక్కిన ఆడవాళ్లు బొత్తిగా చదువుకోనివాళ్లు. ఈఅమ్మాయి బాగా చదువుకుంది. లోకజ్ఞానమూ వుంది. రాత్రి స్వామిని వదిలించుకోడం బ్రహ్మాండమైంది. తెల్లారకుండా యింటికొచ్చేసిందొంటరిగా.

ఇంటికొచ్చాకనే తల్లి ఏంజరిగిందని ప్రశ్నించింది. అమ్మా ప్రపంచమంతా మోసంతో నిండివుంది. దగాతో నిమ్మకుపోయివుంది. కపటప్రపంచం— ఆస్వామిని— ఆజనాన్ని— చూసి— నేనూ నాతోవచ్చిన వాళ్ళూకూడా మోసపోయాము.

అదేమిటమ్మా! అలాంటావు నేనూచూశానుగదా! ఆజనసమ్మర్దం— ఆకానుకలు— ఆప్రభావం— ఆమాహాత్మ్యం— అంది.

నానోటమ్మాట రానీకమ్మా— ఆస్వామిచేసేద్రోహం — ఆడది నోటంట చెప్పడానికూడా అసహ్యంగావుంటుంది.

అంత దుర్మార్గుడా!

ఆహా! మహామోసం—ప్రజలకళ్ళల్లో దుమ్ముగొట్టి—వేలాడిస్తున్నాడు. వాడు నిజంగా యతిగాడు.

ఏంజరిగిందో చెప్పుతల్లీ!

నువ్వు నొక్కడుగుతూంటే చెప్పకుండావుండగలనా? చెపుతాను.

నేను వేలాదిజనంవెళ్ళి విరగబడుతున్నారని — మహానుభావుడని— పరమేశ్వరుడని—అవతారపురుషుడని— లోకులు చెప్పుకునేమాటలు— ప్రతాపాలువిని— ఆసంతోషం చూసి— వేలాదిజనులు పొందేదాన్లో అవగింజంతభాగం మనకుండకపోతుందా అని ఆశపడి ఎప్పుడూ యిల్లుకదలందాన్ని —నామతిచెడిపోయి — తోటివాళ్ళు వెడుతున్నారుగదా అని సిద్ధపడ్డాను.

నాతోవచ్చినవాళ్ళు చెప్పేమాటలు—నా ఆశాలతకి తీగల్ని పెట్టి పెంచాయి— ఆడవాళ్ళతోగదా వెడుతున్నాం— అనేధీమాతో బయలు

చేరాను. ఫలాలు—పుష్పాలు— దక్షిణతాంబూలాలు పుచ్చుకున్నాను. అనుర్మార్గుడి మోసపు దేవాలయంలో ప్రవేశించాం. మేము వెళ్ళేసరికి శిష్యుడితో మాట్లాడుతున్నాడు. మమ్మల్ని చూడగానే అతగాణ్ణి సాగనంపేసి మమ్మల్నాహ్వానించి— మా వందనాలందుకుని— కానుకలు వొళ్ళో వేసుకొని - మీరాగదిలో కెళ్ళి కూచోండన్నాడు — ఆచండాలుని ఆజ్ఞ భగవదాజ్ఞగా భావించి— ఆగదిలో కూచున్నాము.

అతడు లోపలికెళ్ళి రెండుగంటలు పోయింతర్వాత — ఆగదిలో వున్న ఆడంగుల్ని పెద్దవాళ్ళనిముందు — చిన్నవాళ్ళని తర్వాత ఒక్కొక్కర్నే రమ్మనమని కబురంపాడు. ముందెదరింటావిడ వెళ్ళింది. మరో అరగంటకి మనప్రక్క మేడావిడ వెళ్ళింది— ఇంకో అరగంటకి మన ఆఫీసులో హెడ్ గుమస్తాగారిభార్య వెళ్ళింది. పిల్చేవరూ తిరిగి రాలేదు. మరో అరగంటకి నాకు కబురొచ్చింది— ముందు వెళ్ళిన ముగ్గురూ ఏమయ్యారా అని ఆలోచిస్తూ నేను నింపాదిగా ఆకిరాతకుడున్న గదిగుమ్మం దగ్గరకెళ్ళాను. అక్కడొక్కడే వున్నాడు. లోనికిరమ్మన్నాడు. నింపాదిగా లోపలికి అడుగువేశాను.

ఆగదిలో అలంకారాలూ— ఆపందిరిపట్టెమంచమూ— పరుపూ బాలీసులు చూచేసరికి నాఒళ్లు కంపరమెత్తింది. ఆమనిషి యతిగా కాకుండా ఓ రాజపుత్రుడులాగా— పట్టుపీతాంబరం కట్టాడు— గంధం పూసాడు- పూలదండలు మెడనిండా వేశాడు— గదినిండా వెండిసామానులు— ఫలహారాలు-పూలజంగిల్లు—ఇవన్నీ వున్నాయి ఇలావచ్చి కూర్చోమన్నాడు తనుకూచున్న పక్కకుర్చీలో. ఇలా క్రిందకూర్చుంటానన్నాను వల్లకాదన్నాడు. నాకనుమానం పుట్టి అలాగే నిలబడి— నాకంటే వచ్చినవారేమైనా రనడిగాను. వారికి మంత్రోపదేశం చేసి—జపం చెయ్యడంకోసం పక్క గదిలో కూచోబెట్టాను. నువ్వుకూడా మంత్రోపదేశం పొందాలి—దానికి ముందుగా సువ్వీగంధం వంటికిపూసుకొని—అత్తరూ పన్నీరూ సెంట్లూ

బట్టలకి వులువుకొని—ఆ మంచంమీద పడుకో- అప్పుడు నేను మంత్రోపదేశంచేస్తే దాన్నుచ్చరిస్తూ జపం యిద్దరంకలసి చెయ్యాలన్నాడు.

నాకంతా అర్థమైపోయింది. ఒళ్లుమండిపోయింది—కాళ్లు వణుకుతున్నాయి- కోపంయెక్కువౌతోంది—ఎక్కడేనా మంచంమీద మంత్రోపదేశంచేస్తారా! సంతానం కోరివచ్చినవాళ్ళకే యిలాచేస్తాను. లే తొందరగాఅని చెయ్యిపట్టుకుని- లాగబోయాడు నేను కదల్లేదు- బయటకే వెళ్ళిపోదామని వెనక్కి ఓలడుగేశాను- ఆపీనుగులేచి గదిలోపల గడియవేశాడు- నాకళ్ళు చీకట్లుకమ్ముతున్నాయి — నాబుద్ధి తిరిగిపోతోంది. నాకేంతోచడంలేదు. కాని ధైర్యం దిక్కబట్టి- తలుపుతియ్యండి అన్నాను.

నాదగ్గిరికివచ్చినవాళ్ళు న్వర్థంగానొప్పడం నాకపహతిష్ట. తొందరగా మంచమెక్కున్నాడు. నేనులకలేదు—పలకలేదు—ఆమోసగాడు తటాలున లేచి నానడుంచుట్టూ చేతులేసి కౌగలించుకోబోయాడు. ఒక్కతోపుతోశాను. వెనక్కిపడ్డాడు- గబగబా తలుపుతెరిచి బయటపడ్డాను. కాని అన్నితలుపులు బిగించున్నాయి. నేనున్నడవకు దగ్గరగావున్నగదిలో మాట్లాడేచప్పుడు వినిపించింది. నాఅవస్థకంతులేదు. ఆతలుపూమూసేవుంది- తలుపుమీద కొట్టాను. లోపల్నించి తలుపు తెరవబడింది. చూస్తినిగదా నాతోవచ్చినవాళ్ళు ముగ్గురూ అందులోవున్నారు. ఒకళ్ళనొకళ్ళు కౌగలించుకొని ఏడ్చాం. ఇంటికిపోవడం యెలాగయినావిశిదామున తెల్లారేపోదాము అని నిశ్చయించుకుని ఆదుర్మార్గునిచర్యలు తలుచుకుంటూ దవడలువాయించుకొని మమ్మల్ని మేంతిట్టుకుని గుడ్లుతేలుకూర్చున్నాం. తెల్లతెల్లారేముందు గుండెలుచేతబుచ్చుకొని యింటికొచ్చాం. ఆదుర్మార్గుడిలా ఎంతమందిని బలాత్కరిస్తున్నాడో!

అని కూతురు చెప్పింది విని ఆతల్లి ప్రపంచ ఇల్లాలయిపోయింది లోకంకళ్ళల్లో దుమ్ముకొట్టి యిలాకపటనాటకం ఆడే ఆకిరాతుకణ్ణి వదలకూడదు.

అంటూ బుగ్గలునొక్కుగొంది. మీబాబయ్యతో చెప్పి వాడి బాజాకట్టిస్తానని మేడమీదకెళ్ళి సంగతంతా చెప్పింది. అప్పుడక్కడేవున్న గౌరీనాథ్ సంగతంతావిన్నాడు. ముక్కుమీద వేలేసుకున్నాడు—తనపై యధికారి తానూ నాట్లాడుకొని వెంటనే యతిరాజస్వామున్న స్థలానికి కూతురితోసహా వచ్చాడు. కూడా చాలమంది ఉద్యోగస్తు లున్నారు. లోపల చొరబడ్డారందరూను. స్వామింకా లేవలేదు. ఆగందరగోళం గణ నాథం విని బయటకొచ్చాడు. స్వామి జపంలోవున్నాడని చెప్పాడు. నువ్వుముందుగా యివతలికితప్పుకోమని స్వామి గదితలుపులు తీయించారు. లేవకొట్టారు. బయటకి తీసుగొచ్చి ఆగదిలోవున్న సామానంతా బయట పడేశారు. అందులో స్వామికి యింటిదగ్గిర్నించొచ్చిన ఉత్తరాలూ— మణియార్డర్లు—ఇన్స్యూర్డుకట్టిన రసీదులూ—వెండిసామాను—టాయిలెట్టు సామగ్రి—యివన్నీ చిందరవందర చేశారు.

ఎల్లాపాకిపోయిందో యీసంగతి ఊరంతా పదినిమిషాల్లో పాకే సింది. జనంతండోపతండాలుగా వస్తున్నారు దామోదరానికూడా తెలిసి అక్కడకువచ్చాడు. స్వామి నేరంచేసినవాడిలాగా తలొంచుకుని నిలబడ్డాడు. ముఖం పైకెత్తడంలేదు—అప్పుడాయుద్యోగస్తుడు—నివాస మెచ్చట. నువ్వు నిన్నరాత్రి యీమెను బలాత్కరించావాలేదా? ఇల్లా వేషంవేసి డబ్బు ఎన్నాళ్ళుగడిస్తావు అని దవడలు వాయించాడు తప్పు చేశాను కాపాడండని రెండుకాళ్ళూ పట్టుకున్నాడు స్వామి.

దామోదరాన్ని చూచి గౌరీనాథ్ విన్నావటోయి స్వామివారి మహాత్మ్యం. కన్నావుటోయి స్వామికిజరిగేఉత్సవం—

దారుణంగా పోగొడేశావు. నేనప్పుడే చెప్పాను. ప్రపంచం అంతా ఇంతే—అంటూ తన యజమాని ఆజ్ఞకు వేచియున్నాడు.

ఆయజమాని వీళ్ళనిపుడే మళ్ళీ యెత్తించెయ్యాలి అని నవ్వుచేసిన తప్పుకి తలతిరిగినా పాపంలేదు కాని దయదలచి లేవగొడుతున్నాను.

అంటూ సామానులన్నీ మూటలుకట్ట ఆజ్ఞ చేసాడు. జనం రోజూకంటె అక్కడెక్కువగావున్నారు. అందులో కొందరు మామూలుగా స్వామిదర్శనానికివచ్చినవాళ్ళు. మరికొందరు ఈ వార్తవిని వచ్చారు. వీరాస్వామికూడా అక్కడేవున్నాడు. అతగాడిపక్కనే గవరయ్యా— అతనికిదగ్గరినాగా దామోదరం పలబడున్నారు.

వీరాస్వామి అప్పుడు యతిరాజస్వామి సగానిచ్చాన్లే అని గురితించాడు అతడిపక్కనే నుంచున్న దామోదరం అధోలోకంలోకి కుంగిపోయాడు. గౌరీనాథ్ దిగాలుపడిపోయిన దామోదరాన్ని బుజాలు తట్టుతూ—ఇప్పటికైనా తెలుసుకో—ఇటువంటివాళ్ళంతా మోసగాళ్ళనని.

అనడంతోటే దామోదరం నువ్వే నిగ్గావ్ గవరయ్యా అన్నాడు. వీరాస్వామిమాటలో మాటకలిపి బాబయ్యా! ఈ స్నానంజేసినా పాపంలేదు. వర్షానికొంపాలి—మాస్వారే. చిన్నప్పుడు బండా బాయిగ్లాతిరిగేవాడు. తాగేవాడు. కూళ్ళైక దేశాలమ్మటబడి యీవేషంవేసి బాగాగడించి యింటికి పంపాడు—

అంటే నువ్వానమాలు ఝట్టావా అన్నాడు దామోదరం. నేనేదో మతోయి దేశాలందిరుగుతూ స్వామిపరోవున్నారంటో పెద్దప్రభగా వుంటే యిక్కడికొచ్చి మూడుమాసాలనుంచి యిక్కడుండి కనిపెడుతున్నాను. బాగాపన్నాడిక్కడివల, దోచేసాడు. రోజులుగడ్డాయున్నాడు.

అలాపదవోయి పలకరిద్దాం అని గౌరీనాథ్ వీరాస్వామిని యతిరాజుదగ్గరికి తీసికెళ్ళి ఇతనెవరోయెరుగుదువా అండిగితే స్వామికూడా తలకాయ వంచేసుకున్నాడు.

ఆ అధికారి వెంటనే బిచాణా అంతా కట్టించి అక్కడుండే జనాన్నంతటినీ పక్కలకి నెట్టించి తెలివితక్కువొచ్చి బుద్ధిగడ్డితిని యిలాంటి పని చేసానని యేడుస్తున్నాడు. మీరెవ్వరూ వీడి జోలికిపోకండని చెప్పాడు.

'ఆగుంపులోంచి ఒకడు ఎంతమందా డాళ్ళని చెరిపాడు వుండా కోడు' అన్నాడు.

'ఎంతడబ్బు దోచేసాడు దొంగముండాకొడుకన్నాడు మరోడు'

'ఏమైనా తేనేమి దెబ్బలైనకండా దాటిపోతున్నాడన్నాడింకొకడు'

ఈవిధంగా ఎవరికితోచినట్టు వాళ్ళు తిట్టడం మొదలెట్టారు. తల వంచుకొని నడివీధిలో నడుస్తున్నాడు. మొహంమీద ఉమ్మేయ్యని వాళ్ళు లేరు. మనిషిజన్మ త్తినవాడికి పరాభవంచాలదూ!

'ఏంబతుకుబతికాడా?—ఏం వెలుగువెలిగాడ్రా'

అంటూ జనం వెంట బడ్డారు. వువ్వులమ్మినచోటే కట్టెలమ్మవలసిన గతిపట్టినవాడిలా గెంది ఆచార్లుబతుకు—

అలాంటిసమయంలో తప్పంతా పాదుముండాపత్రిజడ్డే. విరగబడి పోయారు. వీడు యతిరాజుకాడు—

—● రతిరాజు ●—



**రాబోవు నవలలు**



# శ్రీ మానాప్రగడ శేషసాయి రచనలు

(read as: శ్రీ మానాపురం వారివి)

1. ప్రేమ హృదయం
2. భర్తలేని భార్య
3. భ్రమ
4. నైట్ షికార్
5. హానీమూన్

వలయువారు:—

పి. వి. రామయ్య సన్స్, రాజమండ్రి.

రాజహంస ప్రెస్, రాజమండ్రి.